**SRINIVASA BALABHARATI - 89**
***(Children Series)***

**CHANDRAHASUDU**

*Kannada Script*
***O.N.Gundu Rao***

*Telugu Translation*
***T.Raghu Kumar***

T.T.D.Religious Publications Series No.: 944



First Edition : 2015

Copies :

*Published by*

**Dr. D. SAMBASIVA RAO I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*D.T.P. :*
Editor-in-Chief Office, TTD, Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,Tirupati.

**శ్రీనివాస బాలభారతి - 89**

# చంద్రహాసుడు

కన్నడ మూలం
**ఒ.ఎన్.గుండూరావు**

తెలుగు అనువాదం
**శ్రీ టి. రఘుకుమార్**

ప్రచురణ
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**
**2015**

## ఆముఖం

చిన్నపిల్లల మనసులు చల్లనైనవి, నిర్మలమైనవి. చక్కగా పెరిగిన పిల్లలు భావిభారత పౌరులై మంచి సభ్యత సంస్కారం పెంచుకొని, తమ కుటుంబానికి, దేశానికి కూడ పేరుప్రతిష్ఠలను సంపాదించి గర్వకారణమౌతారు. మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహాపతివ్రతలు ఎలాంటివారు, వారంత గొప్పవారెలా అయినారనే విషయం, వారి కథలు చెపుతూ పిల్లలకు తెలియజేయగలిగితే, వాటి ప్రభావం లేతమనస్సులపైన చక్కని సంస్కారముద్రలను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతగానో ఉపయోగపడతాయి.

ఈ ఉద్దేశ్యంతోనే ''శ్రీనివాస బాలభారతి'' అనే పుస్తకమాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తోంది. ఇందులో మన భారతదేశంలో అనేక ఆదర్శాలలో ప్రసిద్ధులైన మహాత్ముల చరిత్రలు చిన్న చిన్న వాక్యాలలో చక్కని కథాకథన పద్ధతిలో చెప్పడం జరుగుతుంది. చిన్నారి బాలలు వీటిని బాగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.



కీ.శే.డా॥ ఎస్.బి.రఘునాథాచార్యగారు రూపొందించిన ఈ ప్రణాళికను కొనసాగిస్తూ అదే శీర్షికన చాలా పుస్తకాలను ప్రచురింపజేయటంతోపాటు వాటిని హిందీ, ఆంగ్లం మున్నగు ఇతర భాషల్లోనికి అనువదింపజేస్తున్న ప్రచురణలవిభాగం ముఖ్యసంపాదకులు అభినందనీయులు. ఈ ప్రణాళికలో సహకరించిన రచయితలకు, కళాకారులకు మా ధన్యవాదాలు.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# ఒక్కమాట

చిన్నపిల్లల్లో ధార్మిక జ్ఞానాన్ని కల్గించాలని, బాల్యంలో కల్గిన జ్ఞానం జీవితాంతం వారికి ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ 'శ్రీనివాస బాలభారతి' పథకాన్ని ప్రారంభించింది. దీనికి అప్పట్లో ప్రధాన సంపాదకులుగా ఉండిన ప్రముఖ పండితులు, రచయితలు, మాజీ ఉపకులపతి డా॥యస్.బి.రఘునాథాచార్యులవారు ఈ గ్రంథాలను పరిష్కరించి తీర్చిదిద్దారు. వీరి నేతృత్వంలో కొన్ని వేల ప్రతులను చిన్న పిల్లలకు అందించడం జరిగింది.

మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహా పతివ్రతలు, మహావీరులు భారతీయ సంస్కృతికి చక్కని పునాదులు.వారి జీవిత గాథల్ని సరళ సుందరశైలిలో, అందమైన ముద్రణతో వెలుగులోకి తేవడం జరిగింది. ప్రస్తుతం ఆ పుస్తకాలతో పాటు మరికొన్నింటిని కొత్తగా చేర్చి దేవస్థానం ముద్రించింది. భావి భారత పౌరులైన పిల్లలకు ధార్మిక సాహిత్య పరిచయం కల్గించాలనే సత్సంకల్పంతో తి.తి.దే. వీటిని అందిస్తోంది.

తల్లిదండ్రులే పిల్లలకు ప్రథమ గురువులు. కనుక వారు కూడా ఈ 'శ్రీనివాస బాలభారతి' రచనలను ఆదరించి, పఠించి వాటి ప్రాముఖ్యమును పిల్లలకు తెలియచేసి వారిచేత చదివించాలి. అప్పుడే ఆ బిడ్డలు అందరూ ఆదర్శ వంతులుగా తీర్చిదిద్దబడతారనడంలో సందేహం లేదు. నేటి మొక్కలే రేపటి వృక్షాలు కనుక ఇప్పటినుండి పిల్లలలో నైతికములైన విలువలను, ఆధ్యాత్మిక చింతనను పెద్దలు అలవాటుచేస్తే భవిష్యత్తులో ఉత్తమ పౌరులుగా వెలుగొందుతూ ఆదర్శజీవితం సాగించగలరు. ఆ ఈ సంకల్పానికి ఈ బాలభారతి గ్రంథాలు చేయూతనివ్వగలవని మా విశ్వాసం.

ముఖ్య సంపాదకులు





# చంద్రహాసుడు

కేరళ దేశంలో ఒకానొక రాజు ఉండేవాడు. అతని పేరు మేధావి. 'మేధావి' అంటే గొప్ప వివేక సంపన్నుడని అర్థం. అతడు పేరుకు తగ్గట్లే బహు బుద్ధిమంతుడు. ప్రజలపట్ల ఎనలేని ప్రేమాభిమానాలతో అతడు దేశాన్ని పరిపాలిస్తూ వచ్చాడు. అతని అర్ధాంగి చిత్రభాను. ఆ రాజదంపతులకు చాల కాలం సంతానం కలుగలేదు. తమకు సంతానప్రాప్తి లేదనే దిగులుతో వారు చింతాక్రాంతులయ్యారు.

కొన్ని సంవత్సరాల తర్వాత వారి కోరిక ఫలించింది. వారికి ఒక మగబిడ్డ పుట్టాడు. రాజదంపతుల ఆనందానికి అవధులు లేకపోయింది. సంతోషంతో వారు నగరంలో అందరికీ చక్కెర పంచిపెట్టారు. ఆ పసిబాలుడే చంద్రహాసుడు. బాలుని ఎడమ కాలికి ఆరువ్రేళ్ళు ఉన్నాయి.

అయితే, కొడుకు పుట్టాడనే సంతోషంతో పాటు వారికి దుఃఖం కూడా కలిగింది. బిడ్డ జన్మ నక్షత్రం మంచిది కాదని ఆస్థాన జ్యోతిష్కులు చెప్పారు.



కొన్ని రోజులు గడిచాయి. మేధావి శత్రువులు అతని రాజ్యాన్ని ముట్టడించారు. భయంకర యుద్ధం జరిగింది. పాపం, మేధావి యుద్ధంలో మరణించాడు. వియోగ దుఃఖం భరించలేక అతని భార్య కూడా చితిపేర్చుకొని సహగమనం చేసింది. శత్రువులు రాజ్యాన్ని హస్తగతం చేసుకున్నారు.

## అనాథ బాలుడు :

ఈ విధంగా చంద్రహాసుడు పసితనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని అనాథ అయ్యాడు. రాజాంతఃపురంలో ఒక ముదుసలి ఉండేది. ఆమెకు మొదటినుంచీ చంద్రహాసుడంటే చాల ఇష్టం. రాజు, రాణి చనిపోయిన తర్వాత ఆ వృద్ధురాలు బిడ్డను ప్రేమతో చేరదీసింది. అయితే, ఆమెను కూడా శత్రువులు ఎదిరించారు. ఆమె బిడ్డనెత్తుకొని ఆ ఊరు వదలి కుంతల నగరానికి వచ్చింది.

పాపం, ముదుసలి బిచ్చమెత్తుకుంటూ బిడ్డను పెంచు తుంటుంది. ఊరవతల నున్న ఒక పాడుబడిన మంటపంలో నివాసం. చంద్రహాసుడు రాజకుమారుడుగా జన్మించాడు.



రాజభవనంలో అల్లారుముద్దుగా పెరగవలసినవాడు. అక్కడ ఉంటే దాసదాసీ జనం జాగ్రత్తగా చూసుకొనేవారు. ఇష్టమైన తినుబండారాలు తింటూ, అందమైన, ఖరీదైన దుస్తులు ధరించి సంతోషంగా ఆట్లాడుకోవలసినవాడు. కాని ఇప్పుడతనికి బిచ్చమెత్తుకుంటే దొరికిన అన్నం, చింపిరి గుడ్డలు, గుడిసెవాసం తప్పలేదు.

ఈ విధంగా కొన్ని సంవత్సరాలు గడిచాయి. చంద్రహాసుడు తప్పటడుగులు వేస్తూ నడవడం ప్రారంభించాడు. ఆ సమయంలో మరో విపత్తు సంభవించింది. చంద్రహాసుణ్ణి పెంచుతున్న ముదుసలి మరణించింది. పాపం! ఆ పసిబాలుడికి దిక్కెవరూ లేరు.

ఉంగరాల జుత్తు, చక్కటి అందమైన కళ్ళు, సదా చిరునవ్వు చిందే ముఖవర్చస్సు గల చంద్రహాసుడు చూడముచ్చటగా, సర్వలక్షణ సంపన్నుడుగా ఉన్నాడు. ముద్దులొలికే ఈ బాలుని కుంతల నగర ప్రజలే ఎంతో ఆప్యాయంగా చూడసాగారు. కొందరతనికి రోజూ స్నానం చేయిస్తే మరి కొందరు పండ్లు,

అత్తిరసాలు, ఉండ్రాళ్ళు ఇచ్చేవారు. ఇంకా కొందరు ఆ బాలుని లాలించి, బుజ్జగించి అన్నం తినిపించేవారు. అతనికి మంచి బట్టలు తొడిగి అందంగా ముస్తాబు చేసేవారు. అతని ఈడు పిల్లలందరూ చంద్రహాసుని తమ జతలో చేర్చుకొని ఆటలాడసాగారు. ఈ విధంగా కొన్ని రోజులు గడిచాయి. వయసు పెరుగుతున్న కొద్దీ ఆ పసివానికి తాను అనాథ అనే విషయం తెలియసాగింది. పిల్లలందరూ ఆటలాడడానికి చిల్లాకట్టె, గోలీలు, బొంగరాలు తీసుకువచ్చారు. దానితో అతనికి చాలా విచారం కలిగింది. 'నాకూ గోలీ, బొంగరం కావాలి. అయితే, ఎవరు తెచ్చిపెడతారు' అంటూ దుఃఖపడసాగాడు.

ఇలాగే కొన్ని ఏండ్లు గడిచాయి.

ఒకనాడు చంద్రహాసునికి దారిలో ఒక గోలీ దొరికింది. లావుగా, చిన్నదిగా ఉన్న ఆ గోలీని చూసి అతనికి చాలా సంతోషం కలిగింది. దానిని గభాల్న తీసేసుకున్నాడు. దేవుడే తన కిచ్చాడను కున్నాడు. అదే అతని ఆటగోలీ అయింది.



ఆనాటి నుంచీ గోలీ ఆటలో అతనిదే పైచేయి. ఆ పసిబాలుని ఆనందానికి అంతులేదు. ఆటల్లో తననెల్లప్పుడూ గెలిపిస్తున్న ఆ గోలీని భద్రంగా దాచాలి గదా! కాని అతనికి ఇల్లెక్కడా? అందువల్ల దానినతడు నోట్లోనే భద్రంగా పెట్టుకో సాగాడు.

నిజంగానే అది సామాన్యమైన గోలీకాదు. అది సాలిగ్రామం! (సాలిగ్రామంలో భగవంతుడుంటాడని పూజిస్తారు). పసివానికి ఆ విషయం తెలియదు. చాలా జాగ్రత్తగా ఆ గోలీని కాపాడుకుంటూంటాడు.

## వీడు రాజవుతాడు :

కుంతల నగరంలో ఒక మంత్రి ఉండేవాడు. అతనిపేరు దుష్టబుద్ధి. పేరుకు తగ్గట్లే అతడు చాల దుర్మార్గుడు, క్రూరుడు, మోసగాడు. ఒకరోజు అతని నివాస భవనంలో ఏదో విశేషం జరుగుతున్నది. పుర ప్రముఖులు పలువురు అతని ఇంటికి



భోజనానికి వచ్చారు. కమ్మటి విందు భోజన మారగించిన తర్వాత అతిథులు, మంత్రి దుష్టబుద్ధి తాంబూల సేవనార్థం బయట అరుగుమీద కూర్చొన్నారు. ఆ సమయంలో వీధిలో కొందరు బాలురు ఆట్లాడుకుంటున్నారు. వారిలో ఒక అందమైన బాలుడు కొందరు బ్రాహ్మణుల దృష్టి నాకర్షించాడు. బ్రాహ్మణులు అతనినే తదేక దృష్టితో చూస్తూ 'మహామంత్రీ! ఈ బాలుడెవడు? మీకు తెలుసా?" అని దుష్టబుద్ధిని అడిగారు.

"వీధి వీధి బిచ్చమెత్తుకొని తిరిగే ఎవడో దిక్కులేని బాలుడులా ఉన్నాడు" అని దుష్టబుద్ధి సమాధానమిచ్చాడు. 'కాదండి, తేజస్సు ఉట్టిపడుతున్న అతని ముఖవర్చస్సు చూస్తే ఆ బాలుడికి రాజయ్యే అదృష్టం ఉన్నట్లు కన్పిస్తున్నది. ఏదో ఒకనాడతడు ఈ కుంతల రాజ్యానికి రాజవుతాడు' అని బ్రాహ్మణులు పలికారు.

మంత్రి అసలే దుష్టబుద్ధి. ఈ మాటలు విన్నంతనే అతనికి కోపం ముంచుకు వచ్చింది. చంద్రహాసునివైపు తీక్షణంగా చూడసాగాడు.



వచ్చిన వారందరూ సంభావనలు తీసుకొని వెళ్ళి పోయారు. ఆ తర్వాత మంత్రికి తిన్నతిండీ అరగలేదు, ఆలోచనలతో నిద్రా రాలేదు.

దుష్టబుద్ధికి ఇద్దరు పిల్లలు. కుమారుని పేరు మదనుడు. కుమార్తె పేరు విషయ. ఆ రాజ్యాన్ని పాలిస్తున్న రాజుకు కొడుకులు లేరు. ఏ విధంగానైనా తన కుమారుడు మదనుని రాజ్యానికి రాజుగా చేయాలనేదే దుష్టబుద్ధి పన్నాగం. అయితే, "ఈ అనాథ బాలుడు రాజవుతాడు" అని బ్రాహ్మణులన్న మాటలు విన్న తర్వాత అతని మనస్సు కుదుటపడగలదా?

కాస్సేపు ఆలోచించిన తర్వాత "ఈ బాలకుని ఇప్పుడే చంపేస్తే?" అనే యోచన తట్టింది దుష్టబుద్ధికి.

## మృత్యు ముఖం నుంచి విముక్తి :

దుష్టబుద్ధి వెంటనే ఇద్దరు కిరాతకులను పిలిపించాడు. అమాయకంగా, సంతోషంగా వీధిలో ఆడుకుంటున్న చంద్రహాసుని

వారికి చూపించి “చూడండి, ఆ బాలుని హతమార్చాలి. చంపివేస్తే మీరు కోరినంత డబ్బు ఇస్తాను” అని వారికి చెప్పాడు.

ఆ మాట చెప్పింది మరెవరో కాదు. ఆ రాజ్యానికి మహామంత్రి. అందులోనూ కోరినంత డబ్బిస్తానంటున్నాడు. ఎవడో దిక్కులేని బాలుడు. చంపడానికి ఏమి కష్టం?

'సరే' అన్నారు వారిద్దరు.

'ఈ సంగతి ఎవరికీ తెలియకూడదు. పిల్లవానిని దూరంగా ఎత్తుకు పోయి చంపాలి'.

'చిత్తం'.

'వానిని చంపినందుకు గుర్తుగా నాకేదైనా ఆనవాలు చూపించాలి. ఆ తర్వాతనే డబ్బు'

'చిత్తం'.

ఒకనాడు చంద్రహాసుడొక్కడే ఒంటరిగా వీధిలో వెడుతున్న సమయం చూసి కిరాతకులు అతనిని వెంబడించి పట్టుకున్నారు.



గట్టిగా అరవడానికి, ఏడవడానికి అవకాశం లేకుండా అతని నోట్లో గుడ్డపేలికలు కుక్కారు. చంద్రహాసుడి నెత్తుకొని కటిక చీకటిలో కీకారణ్యానికి పరుగు పరుగున వెళ్ళారు. పాపం, ఆ పసి బాలుడికి చాల భయంవేసింది. కంటి నిండా నీరు, కాని ఏడవడానికి సాధ్యం కాలేదు.

పాషాణ హృదయులైన కిరాతకులు అరణ్యంలో చాల దూరం అతనిని తీసుకు వెళ్ళి ఒక చెట్టు క్రింద దిగబెట్టారు. వారి చేతులలో తళతళ మెరుస్తున్న పదునైన ఖడ్గాలు ఉన్నాయి. వారిని చూచి, వారి చేతుల్లో ఉన్న కత్తులను చూచి చంద్రహాసుడు భయంతో వణకిపోయాడు. తనను వారు చంపేస్తారని తెలిసి వెక్కి వెక్కి ఏడవసాగాడు.

ఇలా దయనీయంగా విలపిస్తున్న ఆ బాలుని వారు చూశారు. స్వభావ సిద్ధంగా వారు క్రూరులు, దురాత్ములు. అయితే, తేజోవంతుడైన ముద్దులొలికే చంద్రహాసుని అలాగే చూస్తున్న వారికి అయ్యో అని జాలి కలిగింది. తమ పిల్లలు గుర్తుకు వచ్చారు.



'పిల్లవాడు ఎంత ముద్దుగా ఉన్నాడు. వీణ్ణి చంపాలా?' అని వారిలో ఒకడన్నాడు.

'పాపం, ఇంత చిన్న వయస్సులోనే వీడికి మరణం ప్రాప్తించాలా? ఈతడేమి తప్పుచేశాడు' అని రెండవ వాడన్నాడు.

మొదటి వాడు మళ్ళీ ఇలా అన్నాడు: 'నాకూ ఇదే వయస్సు గల కొడుకు ఉన్నాడు. వీణ్ణి చూస్తూంటే నా కుమారుడు జ్ఞాపకానికి వస్తున్నాడు”.

'నాకు కూడా పిల్లలు ఉన్నారు. వారికే ఇలా అయితే? అయ్యో పాపం!' ఇది రెండవ వాని ఆవేదన.

' ఈ పిల్లవాణ్ణి చంపితే దేవుడు మనల్ని క్షమిస్తాడా? మన పిల్లలకు మంచి జరుగుతుందా?'

భయంతో వణుకుతూ వెక్కి వెక్కి ఏడుస్తున్న చంద్రహాసుని చూచి వారి గుండె కరిగింది. అనుకోకుండానే వారికి కూడా కంట్లో నీళ్ళు వచ్చాయి.



బాలుని చంపకుండా వెడితే మంత్రికి ఏమి సమాధానం చెప్పాలి? అతడు విశేష ప్రాబల్యం గలవాడు. పైగా దుష్టుడు. బాలుని చంపకుండా వెడితే తమను చంపేస్తాడు.

ఈ విధంగా తర్జన భర్జనలు జరిగిన తర్వాత, చంద్రహాసుని అక్కడే వదలిపెట్టి అతనిని చంపినట్లు దుష్టబుద్ధికి చెప్పాలని వారు చివరకు తీర్మానించుకున్నారు. బాలుని ఎడమకాలికి ఉన్న ఆరవ వ్రేలును కోసి గుర్తుగా అతనికి ఇచ్చివేయాలి. “సరే” అనుకొని “బాలుడా? ఇప్పుడు నిన్ను వదలిపెడుతున్నాం. అయితే నీవు మళ్ళీ ఈ ఊరివైపు రాకూడదు” అని అంటూ వారు చంద్రహాసుని కాలివ్రేలిని కసుక్కున కోసి దాని నెత్తుకొని పారిపోయారు.

విపరీతమైన నొప్పితో చంద్రహాసుడు భోరుమని ఏడవసాగాడు. కాలి నుంచి రక్తం ధారగా ప్రవహిస్తున్నది. అడవిలో పరామర్శించేవారు లేరు. వన్య మృగాలు భయంకరంగా శబ్దం చేస్తున్నాయి. అతడు ఏడుస్తూనే ఉన్నాడు.

అతనిని సముదాయించడం కోసం అడవిలో ఉన్న మృగపక్ష్యాదులు చెంతకు వచ్చాయి. నెమలి తన పురి విప్పి అతనికి గొడుగు పట్టింది. జింకలు అతని కాలినుంచి కారుతున్న రక్తాన్ని నాకివేశాయి. రామచిలుక, పావురం, సారస మొదలైన పక్షులు చంద్రహాసుడికి వినోదం కలిగించాయి. అతడు భగవంతుని స్మరిస్తూ, ఏడుస్తూ అలాగే కూర్చొన్నాడు.

## చందనావతి రాజకుమారుడు :

కొంతసేపయింది. ఆ అడవికి వేటకోసం వేటగాళ్ళ గుంపు ఒకటి వచ్చింది. పులి, సింహం, అడవి ఏనుగు, అడవి ఎనుము, చిరుత, ఎలుగుబంటి, అడవిపంది మొదలైన వన్యమృగాలు వేటగాళ్ళు చేసే రణ గొణ ధ్వనులకు చెదరిపోయి తమ తమ గుహల నుంచి బయటకు వచ్చాయి. వందలాది మంది వేటగాళ్ళు అనేక విధాలైన ఆయుధాలను చేత బట్టుకొని గట్టిగా కేకలు వేస్తూ, చప్పుడు చేస్తూ నానా గలభా చేశారు. ఎన్నో జంతువులు



మరణించాయి. మరి కొన్ని వారికి చిక్కాయి. ఈ విధంగా వారు వేటాడుతుండగా అశ్వారూఢుడై వచ్చిన వేటగాళ్ళ బృందం నాయకుడు ఒక చెట్టు క్రింద కూర్చొని ఉన్న బాలుని చూశాడు. బాలుడు చూడముచ్చటగా ఉన్నాడు. అయితే గాభరాపడి ఏడుస్తున్నాడు. అతడు బాలుని సమీపించి ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు. బాలునికి నోటమాట రాలేదు. మరీ బిగ్గరగా ఏడవసాగాడు. వేటగానికి విపరీతమైన జాలి కలిగింది. అతనికి పిల్లలు లేరు. భగవంతుడే తనకీ పిల్లవానిని ప్రసాదించాడను కున్నాడు. ఎంతో ప్రేమతో బాలుని తన నగరానికి తీసుకువెళ్ళాడు. అతని పేరు కుళిందకుడు. అతడు చందనావతి నగరానికి రాజు. కుంతలపురం మహారాజుకు సామంతుడు.

సంతానం లేదని బాధపడుతున్న కుళిందకుని భార్యకు ఈ పసిబాలుని చూడగానే అమిత సంతోషం కలిగింది. పుత్ర వాత్సల్యంతో బాలుని బుజ్జగించి సముదాయించింది. అన్నం పెట్టింది. గాయానికి మందు పూసింది. ఇప్పుడు పిల్లవానికి భయం



పోయింది. తనను తాను సంబాళించుకున్నాడు. తానెవరు, అడవికి ఎలా వచ్చింది, గాయం ఎలా కలిగింది అనే వివరాలను గురించి ఆ దంపతులు బాలుని అడిగి తెలుసుకున్నారు. చంద్రహాసుని కరుణామయ గాథ విని చాలా బాధపడ్డారు. బాలుని ముఖం చంద్రబింబాన్ని పోలి ఉన్నందున అతనికి చంద్రహాసుడని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచుకున్నారు.

చీకటింటికి ప్రకాశమానమైన మణిదీపం వచ్చిన విధంగా కుళిందకుని ఇంటికి చంద్రహాసుడు వచ్చాడు. ఊరు ఊరంతా ఒకటే సంతోషం. చంద్రహాసుడు రాకుమారుడిలాగా పెరిగాడు. అతని ముఖంలో ప్రస్ఫుటంగా కనిపించే తేజస్సు, అతని బుద్ధి కుశలత, వినయ విధేయతలు చూచి అందరూ మెచ్చుకున్నారు. చంద్రహాసుడు రాజయోగ్యమైన విద్యలన్నింటినీ అభ్యసించాడు.

## ఎవడీ రాకుమారుడు?

చంద్రహాసుడి దగ్గర ఒక గోలీ ఉంది. అది సాలిగ్రామం కదా! అది విశేష మహిమ కలిగినట్టిది. దాని వల్ల చంద్రహాసుడి



మనస్సులో దైవభక్తి జనించింది. అతడు సదా భగవన్నామస్మరణ చేయనారంభించాడు. కాలక్రమేణా చంద్రహాసుడు పెరిగి పెద్దవాడయ్యాడు. ఒకరోజు కుళిందకుడు చంద్రహాసుని దగ్గరకు పిలిచి 'కుమారా! నాకేమో వయసయిపోయింది. ఇక మీదట చందనావతి రాజ్యపాలనా వ్యవహారాలను నీవే చూసుకోవాలి. మనం కుంతల నగరాధీశునికి సామంతులం. ప్రతి సంవత్సరం మనం అతనికి కప్పం కట్టాలి. ఆ సొమ్మును సరిగా లెక్కపెట్టి అధికారుల ద్వారా అక్కడికి పంపించు" అని చెప్పాడు.

మహారాజుకు కట్టవలసిన కప్పాన్ని చంద్రహాసుడు అధికారుల ద్వారా పంపించాడు. వారు నేరుగా మహామంత్రి దుష్టబుద్ధి వద్దకు వెళ్ళి పైకాన్ని ముట్టజెప్పారు. "మా రాకుమారుడు చంద్రహాసుడు ఈ కానుకలను తమకిచ్చి రమ్మని ఆజ్ఞాపించారు" అని అధికారులు చెప్పగా దుష్టబుద్ధికి ఆశ్చర్యం కలిగింది. కుళిందకుడికి పిల్లలు లేరు గదా? ఈ రాకుమారుడు చంద్రహాసు డెవడు? అని తనలో తాను ప్రశ్నించుకొని వచ్చిన అధికారులను కూడా ఆ విషయంగురించి అడిగాడు.

'మా రాజుగారికి అడవిలో ఒక బాలుడు దొరికాడు. అతనిని తీసుకువచ్చి, పెంచి పెద్దచేసి ఇప్పుడతనికి రాజ్యభారాన్ని అప్పగించారు. అతడు గొప్ప దైవభక్తుడు' అని అధికారులు సమాధానమిచ్చారు.

'ఎవరీ పిల్లవాడు? ఏ అడవిలో దొరికాడు? ఎన్ని రోజులయింది?' అని దుష్టబుద్ధి మరల ప్రశ్నించాడు.

చందనావతి అధికారులు సమాధానం చెప్పి వెళ్ళి పోబోతుండగా 'ఈ రాకుమారుడు చంద్రహాసుడు తాను కిరాతకులకు అప్పగించిన బాలుడేనా?' అనే అనుమానం దుష్టబుద్ధికి కలిగింది.

అయితే, ఆ పిల్లవాని కాలివ్రేలిని ఆనవాలుగా తీసుకువచ్చి చూపించారు కదా?

అతని అనుమానం మరింత బలపడింది. అయినా దాని నతడు బయటకు చూపించుకోలేదు. చందనావతి నుంచి వచ్చిన అధికారులను సత్కరించి పంపాడు.



కొన్ని రోజులు గడిచాయి. చందనావతి రాజును చూడాలనే నెపంతో అక్కడికి వెళ్ళడానికి దుష్టబుద్ధి ప్రయాణం కట్టాడు.

దుష్టబుద్ధి బయలుదేరి వెళ్ళేముందు కుమార్తె విషయ వచ్చి అతనికి నమస్కరించింది. అపురూప సౌందర్యవతి అయిన విషయకు పెళ్ళీడు వచ్చింది. మంచి వరుణ్ణి చూసి పెండ్లి చేయాలనుకున్నాడు దుష్టబుద్ధి. ఆ సమయంలో అక్కడే ఉన్న మదనుని పిలిచి 'కుమారా! సద్గుణవంతుడైన భర్త లభించడం కోసం విషయ చేత పూజలు, వ్రతాలు అన్నీ చేయించు. అందుకు కావలసిన ఏర్పాట్లు చెయ్యి' అని చెప్పి దుష్టబుద్ధి చందనావతికి బయలుదేరి వెళ్ళాడు.

## దుష్టబుద్ధి దూత :

చందనావతికి వచ్చిన మంత్రికి కుళిందకుడు అమిత గౌరవంతో స్వాగత సత్కారాలు గావించాడు. తన కుమారుడైన చంద్రహాసుని అతనికి పరిచయం చేశాడు. కిరాతకులకు తన



నప్పగించింది ఇతడేననే విషయం పాపం చంద్రహాసుడికి తెలియదు. మహామంత్రిని గౌరవభావంతో చూశాడు.

దుష్టబుద్ధి మాటలలో చతురుడు. ఎంతో ఆప్యాయంగా చంద్రహాసుడితో మాట్లాడాడు. అతని ఎడమకాలిలో వ్రేలు కోసిన గుర్తును అతి సూక్ష్మంగా గమనించాడు. చంద్రహాసుని ముఖం, అతని కాలివ్రేలు కోసిన గుర్తు ఇవన్నీ చూచిన తర్వాత, కిరాతకులకు తానప్పగించిన బాలుడీతడేనని దుష్టబుద్ధికి కచ్చితంగా తెలిసింది. "ఇతడు ఏదో ఒకరోజు కుంతల దేశానికి రాజవుతా' డన్న బ్రాహ్మణుల వాక్కు అతనికి జ్ఞప్తికి వచ్చింది.

'ఆ బాలుడే ఇతడు. సందేహం లేదు. కిరాతకులు నన్ను మోసం చేశారు. ఒక వ్రేలిని మాత్రం కత్తిరించి దానిని గుర్తుగా చూపించారు. ఎంతపని జరిగిపోయింది? కానిమ్ము, ఇందుకు వేరే ఉపాయం ఆలోచిస్తాను' అని దుష్టబుద్ధి తీర్మానించుకున్నాడు.

దుష్టబుద్ధి ఈ విధంగా ఆలోచించి చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. "చంద్రహాసుడి ద్వారా కుమారుడైన మదనునికి ఒక ఉత్తరం పంపాలి." 'ఈ లేఖను తీసుకు వస్తున్న యువకుడికి



విషమిచ్చి చంపు. ఎవరు, ఎందుకు అని ఆలోచించవద్దు' అని వ్రాయాలి. మదనుడు నా మాట ప్రకారం నడచుకుంటాడు. చంద్రహాసుడి కథ ముగిస్తుంది. రాజ్యం మదనుడికి దక్కుతుంది" అని అనుకున్నాడు.

తెల్లవారింది. దుష్టబుద్ధి కుమారునికి లేఖ వ్రాశాడు. చంద్రహాసుని పిలిచి "నాయనా చంద్రహాసా! నేను కొన్ని రోజులు ఇక్కడ ఉండవలసిన పని తగిలింది. కుంతల నగరంలో ఉన్న నా కుమారుడు మదనుడికి ఒక ముఖ్య విషయం తెలియజేయాలి. లేఖ వ్రాసి ఇస్తాను. నీవు దానిని అతడికిచ్చి రావాలి. ఇది చాలా రహస్యమైన విషయం. మనిద్దరిలోనే ఉండనీ, లేఖను త్వరగా చేర్చాలి" అని చెప్పాడు.

చంద్రహాసుడు సంతోషంతో అంగీకరించాడు. మర్నాడే తన తల్లిదండ్రులకు నమస్కరించి దుష్టబుద్ధి ఇచ్చిన లేఖను తీసుకొని కుంతల నగరానికి బయలుదేరాడు.

లేఖను త్వరగా చేర్చాలని మహామంత్రి ఆదేశించారు కదా. చంద్రహాసుడు గుర్రమెక్కి అతివేగంతో కుంతల నగరానికి

వెళ్ళాడు. మూడు నాలుగు రోజులు ప్రయాణం చేసిన తర్వాత కుంతల నగరం చేరుకున్నాడు. నగరం పొలిమేరలో ఒక సుందరోద్యానవనం, ఫల పుష్పాదులతో రమణీయంగా ఉన్న ఆ వనాన్ని చూసిన చంద్రహాసుడికి సంతోషం కలిగింది. గుర్రాన్ని పచ్చిక మేయడానికి వదలిపెట్టాడు. వేగంగా ఇంతదూరం ప్రయాణం చేసివచ్చిన అతనికి అలసట కలిగింది. నిద్ర ముంచుకు వచ్చింది. ఒక చెట్టు క్రింద పడుకొని నిద్రపోయాడు.

## తండ్రి లేఖను చదివిన తనయ:

కొంత ప్రొద్దు గడిచింది. రాజకుమారి చంపకమాలిని చెలికత్తెలతో వనవిహారానికి వచ్చింది. దుష్టబుద్ధి కుమార్తె విషయ కూడా ఆమె వెంట వచ్చింది. ఆనందోత్సాహాలతో కేరింతలు కొడుతూ, పరుగెడుతూ తోటలో వారు ఆట్లాడుకున్నారు. తర్వాత పూలు కోయ నారంభించారు. అటు ఇటు పరుగెడు తున్న దుష్టబుద్ధి కుమార్తె విషయ ఒక పెద్ద మామిడిచెట్టు ప్రక్కన ఉన్న మల్లె



పందిరి దగ్గరకు వచ్చింది. చెట్టుక్రింద చంద్రహాసుడు మైమరచి నిద్రిస్తున్నాడు.

విషయ క్షణకాలం అలాగే నిలుచుని అతణ్ణి చూసింది. “ఎంత అందంగా ఉన్నాడు? ముఖంలో ఎంత తేజస్సు? ఏ దేశపు రాకుమారుడో? దైవేచ్ఛ ఉంటే ఈతడు నన్ను పరిణయమాడితే....” అని విషయ ఆశగా తనలో తాననుకుంటూ అతణ్ణే చూస్తూ నిలుచుంది.

చంద్రహాసుడు ధరించి ఉన్న దుస్తులలో మడతపెట్టి ఉన్న లేఖ ఒకటి కనిపించింది. అతడెవరో తెలుసుకోవాలనే ఉబలాటంతో విషయ దానిని మెల్లగా పైకి తీసింది. ‘మదనకుమారునికి’ అనే చిరునామా కనిపించింది. తండ్రి దస్తూరి! విషయకు ఆశ్చర్యంతో పాటు కుతూహలం కలిగింది. ఈతనిని తండ్రి పంపించాడు. ఎందుకయ్యుంటుంది?

లేఖను విప్పి చదివితేగాని విషయం తెలియదు.



అయితే, ఆ లేఖ వ్రాసింది మదనుడికి. తాను చదవడం సరియేనా?

అయినప్పటికీ విషయకు కుతూహలాన్ని అణచుకోవడం కష్టమైంది. ఆలస్యం చేస్తే చెలికత్తె లెవరైనా వచ్చే ప్రమాదం ఉంది.

విషయ మెల్లగా లేఖ విప్పి చదవసాగింది. ఇదేమిటి? ‘ఈ లేఖను తెచ్చి ఇచ్చే వానికి ఆలస్యం చేయకుండా విషం ఇవ్వు. ఇతనెవరు, ఎందుకు అని ఆలోచించవద్దు. ఆలస్యం చేయవద్దు,’ అని తండ్రిగారు వ్రాశారే? ఈతడేమి తప్పుచేసి ఉంటాడు? విషం ఇవ్వాలంటే ఈతడేదో చాలా చెడ్డపని చేసి ఉండాలి. అయితే, ఈతని ముఖంచూస్తే ఎంత తేజస్సు, ఎంత మంచివాడు! ఈతడెలాంటి తప్పుచేసి ఉండడు.

ఈ ఆలోచనలన్నీ విషయ మనస్సులో మెదలసాగాయి.

చందనావతికి బయలుదేరి వెళ్ళేముందు తన తండ్రి చెప్పిన మాటలు ఈ తరుణంలో ఆమెకు స్ఫురణకు వచ్చాయి.



“ఓ! ఈతడు తండ్రి నాకోసం చూసిన వరుడు అయ్యుండవచ్చు, బహుశా వ్రాసే తొందరలో విషయను ఇవ్వు అనడానికి బదులు విషం ఇవ్వు అని పొరపాటున వ్రాసి ఉండవచ్చు’ అనుకుంది. చేతివ్రేలి గోటిని లేఖనిగా చేసుకొని కంటి కాటుకను మసిగా పూసి ‘విషం ఇవ్వు’ అనే మాటను ‘విషయను ఇవ్వు’గా దిద్దింది. లేఖను ఇదివరకటి లాగానే మడిచి లక్క అంటించి చంద్రహాసుని వస్త్రం సొరుగులో యథాప్రకారం ఉంచి వడివడిగా ఇంటికి వెళ్ళిపోయింది.

## పెండ్లి కుమారుడు చంద్రహాసుడు:

బడలిక చెందిన చంద్రహాసునికి గాఢంగా నిద్దుర పట్టింది. తాను నిద్రపోతున్నప్పుడు ఏమి జరిగిందో అతనికి తెలియదు. నిద్ర లేచిన తర్వాత జాగ్రత్తగా చుట్టూ కలయజూశాడు. ఎంత ప్రొద్దుపోయిందనుకున్నాడు. వన మధ్యంలో ఉన్న సరస్సులో ముఖప్రక్షాళనం చేసుకొని వేగంగా నగరానికి బయలుదేరాడు. కిరాతకులు తనను కుంతల నగరం నుంచి ఎత్తుకు పోయినప్పుడు

అతడు చాలా చిన్నవాడు. నగరం అందచందాలను అతడు మరచిపోయాడు. రాజధాని అతి సుందరమైన నగరం. ఆకాశ హర్మ్యాలు, అంగడి వీథిలో కళ్ళు మిరుమిట్లు గొలిపే వస్తువులు, వస్త్రాలు కుప్పలు కుప్పలుగా కనిపించాయి. అవన్నీ చూసుకుంటూ చంద్రహాసుడు మహామంత్రి నివాసభవనాన్ని సమీపించాడు.

మదనుడు చంద్రహాసుని స్నేహపూర్వకంగా ఆహ్వానించాడు. అతని ముఖవర్చస్సు, మాటల్లో ఉట్టిపడే వినయం, సౌజన్యం మదనుని ముగ్ధుణ్ణి చేశాయి. చంద్రహాసుడు తాను తెచ్చిన లేఖను ఇచ్చాడు. మదనుడు దానిని చదివాడు. 'ఈ లేఖ తీసుకువచ్చిన యువకుడికి ఆలస్యం చేయకుండా విషయను ఇవ్వు! లేఖను చదివిన మదనకుమారుడి ఆనందానికి అంతులేదు. చంద్రహాసునికి రాజమర్యాదలతో స్వాగతం పలికాడు. ఆస్థాన పురోహితులను పిలిపించి చెల్లెలి పెండ్లికి అవసరమైన ఏర్పాట్లు చేయించాడు.

ఒక శుభముహూర్తంలో విషయకు, చంద్రహాసుడికి అతి వైభవంగా వివాహం జరిగిపోయింది.



## మామకు ఎదురు వచ్చిన అల్లుడు :

మహామంత్రి దుష్టబుద్ధి చందనావతి నుంచి కుంతల నగరానికి బయలు దేరాడు. "ఈపాటికి చంద్రహాసుడు మరణించి ఉంటాడు. ఇక రాజ్యాధికారం మనదే" అని దారి పొడవునా సంతోషంగా అనుకుంటూ వచ్చాడు.

కుంతల నగరంలో ప్రవేశించాడు దుష్టబుద్ధి. 'వీధులన్నీ శోభాయమానంగా అలంకరించారేమిటి? ఏమి జరిగింది? నాకు తెలియకుండా కుంతల నగరంలో ఇంత కోలాహలంగా ఏమి ఉత్సవం జరుగుతున్నది?' అని ఆశ్చర్యపడుతూ దుష్టబుద్ధి ముందుకు వచ్చాడు. వందలాదిమంది ప్రజలు అతనికి ఎదురు వచ్చారు. వారి చేతుల్లో పెళ్ళికానుకలు ఉన్నాయి. 'పెళ్ళికొడుకు ముఖంలో ఎంతకళ? పెళ్ళికూతురు ఎంత అందంగా ఉంది? ఈడూ జోడూ చూడముచ్చటగా ఉంది' అని మాట్లాడుకుంటూ వస్తున్నారు.

'ఇదేమిటి కుంతల నగరమంతా అలంకరించారు? ఏమిటీ విశేషం?' అని దుష్టబుద్ధి వారిలో కొందరి నడిగాడు.



వారికి ఆశ్చర్యం కలిగింది. 'ఏమిటిది? జరుగుతున్నది మంత్రి కుమార్తె వివాహం. మంత్రిగారే ఇలా అడుగుతున్నారేమిటి చెప్మా!' అని వారు ఆశ్చర్యపడ్డారు. అయినప్పటికీ వైభవంగా జరిగిన వివాహం వార్తను వాళ్లు సంతోషంగా మంత్రికి తెలియజేశారు.

దుష్టబుద్ధికి తేలుకుట్టినట్లయింది. క్షణకాలం దిక్కుతోచ లేదు. మనస్సు కలవరపడింది. గబగబ తన నివాసానికి వెళ్ళాడు.

మంత్రి నివాస భవనం రమణీయంగా అలంకృతమై ఉంది. మంగళ వాద్యాలు వినిపిస్తున్నాయి. ఎక్కడ చూచినా ఒకటే కోలాహలం, సంతోషం, ఉత్సవ సంరంభం.

అశ్వారూఢుడై వచ్చిన మంత్రి వెంటనే గుర్రం దిగి దిగ్భ్రమతో ఇంటిలోనికి వెళ్ళాడు.

ఇంతలోనే వచ్చిన తండ్రిని చూచి మదనుడు ఆశ్చర్య పడ్డాడు. పెళ్ళిరోజే ఇంత వేగంగా వచ్చేశారు గదా అని సంతోషించాడు. ఆశ్చర్యంతో ఎదురువెళ్ళి తండ్రికి స్వాగతం పలికాడు.



విషయ కూడా ఆనందించింది. ఆమె, చంద్రహాసుడు నూతన వధూవరుల దుస్తులు ధరించి ఉన్నారు. ఉభయులూ దుష్టబుద్ధికి పాదాభివందనం చేశారు.

మంత్రి కళ్ళు అగ్నిగోళాలవలె నిప్పులు కురుస్తున్నాయి. మనస్సు పాముల పుట్ట అయింది. కోపంతో, ద్వేషంతో, హృదయం బుసకొట్టుతున్నది. కుమారుని పిలిచి 'ఓరీ వివేకహీనుడా! ఎంతపని చేశావు? నేను వ్రాసిందేమిటి? నీవు చేసిందేమిటి? అని గదమాయించాడు. తండ్రి మాటలు విన్న మదనుడికి ఆశ్చర్యం కలిగింది. 'తమ లేఖ ప్రకారమే నడచుకున్నాను. ఇందులో అపరాధం ఏముంది? అని అడిగాడు.

'మూర్ఖుడా! స్పష్టంగా వ్రాశాను కదా? ఆ మాత్రం అర్థం కాలేదా? అని తండ్రి కోపంతో ఊగిపోయాడు.

'అప్పాజీ! ఇందులో నా తప్పేమీ లేదు. మీరు వ్రాసిన దానికంటె శీఘ్రంగానే పెండ్లి జరిపించాను. ఇది కూడా ఆలస్యమని భావించే పక్షంలో నన్ను మన్నించండి' అంటూ మదనకుమారుడు లేఖను తండ్రి ముందుంచాడు.

దుష్టబుద్ధి చదివాడు, 'విషయను ఇవ్వు' అని స్పష్టంగా వ్రాసి ఉంది! తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. 'విషం ఇవ్వు' అని మనస్సులో అనుకుంటూనే 'విషయను ఇవ్వు' అని నేను వ్రాసి ఉంటానా? అనే ఆలోచన కలిగింది. కార్యం మించిపోయింది. దుష్టబుద్ధి మనస్సు కల్లోలితమైంది.

అయినప్పటికీ దుష్టబుద్ధి కోపాన్ని, ద్వేషాన్ని, దుఃఖాన్ని దిగమ్రింగుకొని కుమార్తెతోనూ, అల్లుడితోనూ ప్రేమగా మాట్లాడాడు.

'చంద్రహాసుణ్ణి ఎలాగైనా చంపితీరాలి' అనే దురాలోచన మంత్రి మనస్సులో గాఢంగా నాటుకున్నది.

## 'కాళికాదేవి పూజకు వెళ్ళు' :

చంద్రహాసుడు ఇప్పుడతని అల్లుడు. తన ఏకైక గారాలపట్టి విషయకు భర్త, చంద్రహాసుడు మరణిస్తే ఆమె సౌభాగ్యం హరించుకుపోతుంది. ఈ సంగతి దుష్టబుద్ధికి తెలియనిదికాదు. అయినా, రాజ్యకాంక్ష అనేది బలవత్తరమైంది. అది మానవునిలో



వివేకాన్ని నశింపజేస్తుంది. చంద్రహాసుని హతమార్చడానికి రెండుసార్లు తాను ప్రయత్నించినప్పటికీ అతడు తప్పించుకున్నాడు. తన కుమారుడు సింహాసనాన్ని చేజిక్కించుకోవడానికి ఇతడు అడ్డుగా ఉన్నాడు. ఇతనిని సంహరించి తీరాలి అనేదే దుష్టబుద్ధి సంకల్పం.

దుష్టబుద్ధి రహస్యంగా మళ్ళీ కిరాతకులను పిలిపించాడు. 'ఊరవతల ఉన్న కాళికాలయం వద్ద పొంచి ఉండండి. పూజా ద్రవ్యాలు తీసుకొని అర్ధరాత్రి వేళ ఒకడు అక్కడికి వస్తాడు. వెనుకా ముందు చూడకుండా అతని తల నరికివేయండి' అని ఆజ్ఞాపించి వారికి చేతినిండా డబ్బిచ్చి పంపాడు.

తర్వాత చంద్రహాసుణ్ణి పిలిచి ప్రక్కన కూర్చోబెట్టుకొని ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు. 'నీవు అల్లుడుగా దొరకడం నాకు చాలా సంతోషంగా ఉంది. ఇది మా అదృష్టం' అని నమ్మకం కలిగేలా అన్నాడు. 'అయితే, మా వంశంలో ఒక ఆచారం ఉంది. ఈ ఊరవతల అరణ్యంలో కాళికాదేవి ఆలయం ఒకటుంది. క్రొత్తగా పెళ్ళయిన వరుడు పెళ్ళిరోజునే కాళీ మందిరానికి వెళ్ళి



పూజ చేసి రావాలి. ఒక్కడే ఒంటరిగా వెళ్ళాలి. దేవీపూజ అర్ధరాత్రి చేసి రావాలి. నీవు కూడా ఈ ఆచారాన్ని పాటించు. నీకు మేలు జరుగుతుంది' అని దుష్టబుద్ధి చంద్రహాసుడితో చెప్పాడు. అభిమానంతో మామగారన్న మాటలు విని చంద్రహాసుడు సంతోషంతో పొంగిపోయాడు. 'తప్పకుండా వెళ్ళి వస్తాను. దేవీ పూజ అంటే నాకు కూడా ఇష్టమే. పైగా అది సంప్రదాయ మంటున్నారు. సంతోషం, ఈ రాత్రికే వెళ్ళి వస్తాను' అని చంద్రహాసు డన్నాడు. ఈసారైనా తన పన్నాగం ఫలించగలదని దుష్టబుద్ధి ఆశించాడు.

## చంద్రహాస మహారాజు :

కుంతల దేశపు రాజు ఏకైక పుత్రిక చంపకమాలిని. ఉద్యానవనంలో చంద్రహాసుడు మైమరచి నిద్రిస్తున్నప్పుడు విషయతో పాటు ఆమె కూడా వనంలో విహరించింది. రాజుకు మగ పిల్లలు లేరు. అతనికి వార్ధక్యం సమీపించింది. తత్ఫలితంగా రాజ్యాధికారాలన్నింటినీ మంత్రి దుష్టబుద్ధి, అతని కుమారుడు



మదనుడు హస్తగతం చేసుకున్నారు. తన కుమార్తెను ఒక మంచి వరునికిచ్చి పెండ్లిచేసి, అల్లుడికి రాజ్యభార మప్పగించి అడవికి వెళ్ళి తపస్సు చేసుకోవాలని రాజు సంకల్పించాడు. గురువైన గాలవ మహర్షికి నమస్కరించి (ప్రణమిల్లి) ఈ విషయంలో ఆయన సలహా కోరాడు.

'రాజా! నీకు ఆయుర్దాయం ఇంకా ఎక్కువ కాలం లేదు' అని రాజగురువు చెప్పాడు.

'నాకు రాజ్యభారం ఇక చాలు. అయితే కుమార్తె ఉంది. రాజ్యపాలనా బాధ్యత ఉంది. ఏం చేయమంటారు గురుదేవా?' అని రాజు అడిగాడు.

'తేజస్వి అయిన చంద్రహాస రాకుమారుడు సకల సద్గుణ సంపన్నుడు. రాజు కావడానికి అన్ని అర్హతలు గలవాడు. అతడికి నీ కుమార్తెనిచ్చి పెండ్లి చేసి రాజ్యాన్ని అప్పగించు" అని గాలవ మహర్షి సలహా ఇచ్చాడు.

గురువు మాటలు విన్నప్పటి నుంచీ రాజుకు తనకు మృత్యువు ఎప్పుడు వస్తుందో అనే బెంగ పట్టుకున్నది. 'వివాహం ఎప్పుడు చేయమంటారు?" అని గాలవ మహర్షిని అడిగాడు.

'ఈ రోజే చాలా శుభప్రదమైంది. చంద్రహాసుణ్ణి వెంటనే పిలిపించి ఆ శుభకార్యాన్ని పూర్తి చేయించు' అని ఆయన సూచించాడు.

'తక్షణమే రమ్మన్నానని చంద్రహాసునితో చెప్పి ఆలస్యం చేయకుండా అతనిని పిలుచుకురండి' అని దూతలను రాజు ఆదేశించాడు. వారు వెంటనే మంత్రి నివాస భవనానికి వెళ్ళారు.

అక్కడ వారికి మొదట మదనుడు కనిపించాడు.

రాజదూతలు మదనుడికి నమస్కరించి 'ఆలస్యం చేయకుండా చంద్రహాస కుమారుని వెంటనే పిలుచుకు రమ్మని రాజాజ్ఞ' అని సవినయంగా అతనితో అన్నారు.

రాత్రయింది. చంద్రహాసుడు పూజాద్రవ్యాలను బంగరు పళ్ళెరంలో ఉంచుకొని పట్టు పీతాంబరాలు ధరించి కాళికాలయానికి



వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు. ఆ సమయంలో మదనుడు పరుగెత్తుకుంటూ వచ్చి 'రాజమందిరం నుంచి వార్త వచ్చింది. నీవు వెంటనే మహారాజు దర్శనం చేసుకోవాలట' అని చంద్రహాసుడితో చెప్పాడు.

'నేనిప్పుడేమి చేయడం? అర్ధరాత్రి కాళికాలయానికి వెళ్ళి పూజ చేయాలని మామగారు నన్ను ఆదేశించారు. రాజమందిరానికి వెళ్ళి రావడానికి కొంచెం ఆలస్యమవుతుంది' అని చంద్రహాసు డన్నాడు.

'కాళికాలయానికి నేను వెడతాను. పెళ్ళిరోజు పూజ జరగడం ముఖ్యం. ఎవరు పూజ చేస్తే ఏమి? నీవు తక్షణమే మహారాజు వద్దకు వెళ్ళు' అని చెప్పి మదనుడు చంద్రహాసుని పంపివేసి కాళికాలయానికి తానే బయలుదేరాడు.

చంద్రహాసుడు రాజమందిరానికి వెళ్ళాడు. అతడిని చూచిన మహారాజుకు చాలా సంతోషం కలిగింది. తన కుమార్తెను అతనికిచ్చి వెంటనే పెండ్లి చేశాడు. పట్టాభిషేక మహోత్సవం కూడా జరిపించి తపోసాధనకై అడవులకు వెళ్లిపోయాడు.



## దుష్టబుద్ధి ఆజ్ఞానుసారం :

ఇది ఇలా ఉండగా, చంద్రహాసుని వద్ద నుంచి పూజా ద్రవ్యాలను తీసుకున్న మదనుడు కాళికాలయానికి బయలుదేరాడు. కటిక చీకటిలో, కారడవిలో మనుష్య సంచారంలేని స్థలానికి వెళ్ళాలి. చుట్టూ భయంకరమైన శబ్దాలు. అతని చేతిలో ఉన్న పళ్ళెరం జారి క్రిందపడింది. మనస్సులో ఎందుకో భయం ఆవరించింది. దుశ్శకునాలు తోచాయి. అయినప్పటికీ కాళికాలయానికి వెళ్ళి పూజచేసి వస్తానని చంద్రహాసుడికిచ్చిన మాట గుర్తుకు వచ్చి మదనుడు ముందుకు నడిచాడు.

అరణ్యంలో ఒక వైపు దేవాలయం వద్ద ఉన్న చెట్ల వెనుక దుష్టబుద్ధి నియోగించిన భటులు పొంచి ఉన్నారు. మదనుడటు వైపుగా వచ్చాడు. 'మన యజమాని చెప్పిన వ్యక్తి ఇతడే' అనుకొని వారు మెల్లగా అతనిని వెంబడించారు. అతడు దేవాలయంలోనికి ప్రవేశిస్తుండగా వారతని పై దూకి తమవద్దగల కత్తులతో అతని తల నరికివేశారు. మదనుడు నేలకూలాడు. హంతకులు పారిపోయారు.



## 'అంతా అయిపోయింది' :

తాను రాజైన విషయం ప్రజలకు తెలియజేయాలనే ఉద్దేశంతో చంద్రహాసుడు చంపకమాలినితో పాటు గజాధిరోహుడై నగరంలో ఊరేగింపుగా బయలుదేరాడు. ఊరేగింపు అత్యంత వైభవంగా జరుగుతోంది. మంగళవాద్యాల శబ్దం విని దుష్టబుద్ధి బయటకు వచ్చి చూశాడు. ఇంకేముంది! ఏనుగు మీద బంగారు అంబారీలో రాకుమారితో పాటు చంద్రహాసుడు కనిపించాడు.

చంద్రహాసుడు రాజయ్యాడనే సంగతి అతనికి అర్థమై పోయింది. కోపాన్ని, దుఃఖాన్ని అణచుకోలేకపోయాడు.

మామగారిని చూసిన చంద్రహాసుడు అంబారీ నుంచి దిగివచ్చి నమస్కరించాడు.

ఇదేమిటి చంద్రహాసా! మన కుటుంబ సంప్రదాయం ప్రకారం కాళికాలయానికి వెళ్ళి పూజచేసి రావాలంటే ఒప్పు కున్నావు గదా? ఎందుకు వెళ్ళలేదు? ఈ విధంగా చేయడం న్యాయమా? అని దుష్టబుద్ధి అడిగాడు.

'పూజ్యులైన మామగారూ! కాళికాలయానికి వెళ్ళడానికి నేను సిద్ధంగా ఉన్నప్పుడు మదనకుమారుడు వచ్చి రాజుగారు నన్ను పిలుస్తున్నారని చెప్పాడు. నాకు బదులు తానే దేవాలయానికి వెళ్ళి వస్తానని పూజాద్రవ్యాలను కూడా నా వద్దనుంచి తీసుకున్నాడు" అని చంద్రహాసుడు చెప్పాడు.

దుష్టబుద్ధికి పంచప్రాణాలు ఎగిరిపోయినట్లయింది. చంద్రహాసుని సమాధానం పూర్తయ్యేదాకా అతడు నిలవలేదు. ఆ నిశిరాత్రిలోనే కాళికాలయానికి పిచ్చివాడిలాగా పరుగెత్తాడు. రక్తపు మడుగులో మదనుని శిరస్సు తేలుతుండడం చూశాడు. పూజాద్రవ్యాలు చెల్లాచెదరుగా పడిఉన్నాయి.

దుష్టబుద్ధికి మనస్సు విరిగిపోయింది. 'అంతా అయి పోయింది' అంటూ క్రిందపడి వెక్కివెక్కి ఏడ్చాడు. ఆలయ శిలాస్తంభానికి తల కొట్టుకొని అతడు కూడా మరణించాడు.

## చంద్రహాసుని కరుణ :

తెల్లవారింది. మంత్రి, అతని కుమారుడు దేవాలయం వద్ద మృతులై పడి ఉన్నారనే వార్త నగరమంతటా దావానలంలా



వ్యాపించింది. చంద్రహాసునికి దిక్కుతోచలేదు. కాళికాదేవి ఆలయానికి వచ్చాడు. ఈ ఘోరాన్ని చూడడానికి వచ్చిన వేలాది మంది ప్రజలు గుంపు చేరారు. పాపం, విషయ ఏకకాలంలో తండ్రిని, అన్ననూ పోగొట్టుకొని హృదయవిదారకంగా విలపిస్తున్నది. ఆ పరిస్థితిలో ఏమిచేయాలో చంద్రహాసుడికి తోచలేదు. లోకమాత అయిన మహాకాళిని ఏకాగ్రచిత్తంతో ప్రార్థించాడు. "మాతా! ఇదేమి అన్యాయం? వీరిని నీవే కాపాడాలి. లేకుంటే ఇదిగో నన్ను కూడా బలి తీసుకో" అంటూ సొరుగులో ఉన్న కత్తిని చేత బుచ్చుకున్నాడు.

లోకమాత చంద్రహాసుని ఎదుట ప్రత్యక్షమై అతని చెయ్యి పట్టుకొని వారించింది. 'వత్సా! ఏం పని చేస్తున్నావు? ఈ దుష్టబుద్ధి నిన్ను చంపడానికి ప్రయత్నించాడు. తన దురాలోచనలకు తగిన ప్రతిఫలం పొందాడు. అంతే, ఇప్పుడు నీకు కావలసిన వరమిస్తాను. ఇష్టమైంది కోరుకో" అని కాళికాదేవి పలికింది. చంద్రహాసుడు జగన్మాతకు చేతులు జోడించి నమస్కరిస్తూ "తల్లీ! నాకేమీ వద్దు. నా మామగారిని, మదనకుమారుని మళ్ళీ బ్రతికించు' అని



సవినయంగా వేడుకున్నాడు. తనకు చెడుపు చేసిన వాడిపట్ల చంద్రహాసుడు చూపిన కరుణకు కాళికాదేవి సంతసించింది. మృతులైన వాళ్ళిద్దరూ లోకమాత అనుగ్రహంతో లేచి కూర్చొన్నారు.

## శ్రీకృష్ణ దర్శనం :

దుష్టబుద్ధికి ఇప్పుడు మంచి బుద్ధి వచ్చింది. తాను చేసిన పాపకార్యాలకు పశ్చాత్తాపం చెందాడు. తనను క్షమించవలసిందిగా కుమార్తెను, అల్లుణ్ణి కోరాడు. అందరూ సంతోషంతో ఒకటయ్యారు.

చంద్రహాసుడు పెక్కు సంవత్సరాలపాటు ధర్మబద్ధుడై రాజ్యపాలన సాగించాడు. ప్రజల సుఖమే తన సుఖంగా భావించాడు. అతనికి శ్రీకృష్ణునియందు అపారమైన భక్తి.

చంద్రహాసునికి ఇద్దరు కుమారులు. మకరధ్వజుడు, కమలాక్షుడు అనే వీరిరువురూ గొప్ప పరాక్రమవంతులు.

పాండవులు శ్రీకృష్ణుని భక్తులు. వారిలో అగ్రజుడు ధర్మరాజు. ఇతడు అశ్వమేధయాగం చేయాలని సంకల్పించాడు. ఈ యాగం చేయదలచినవారు ఒక ఉత్తమాశ్వాన్ని పూజించి ఆ



తర్వాత దానిని స్వతంత్రంగా వదలివేయాలి. అది ఎక్కడికైనా వెళ్ళవచ్చు. అయితే, యాగం చేయ దలపెట్టిన రాజు సైనికులు ఆ అశ్వం వెంట వెళ్ళాలి. ఎవరైనా దానిని కట్టివేసినట్లయితే యుద్ధం చేసి దానిని విడిపించుకోవాలి. ఈ విధంగా ఒక సంవత్సరం కాలం అశ్వాన్ని రక్షించిన తర్వాతనే అశ్వమేధయాగం చేయాలి.

ధర్మరాజు అశ్వాన్ని వదలిపెట్టాడు. దానికి కాపలాగా శ్రీకృష్ణుడు, ధర్మజుని తమ్ముడైన అర్జునుడు బయలుదేరారు.

అశ్వం కుంతల నగరానికి వచ్చింది. మకరధ్వజుడు, కమలాక్షుడు దానిని పట్టుకొని కట్టివైచి తండ్రికి సమాచారం తెలియజేశారు. 'అశ్వాన్ని విడిపించుకొనదలచిన వారి పరాక్రమాన్ని యుద్ధంలో చూడండి' అని అన్నారు.

'కుమారులారా! నేను చిన్ననాటి నుంచీ పూజిస్తున్న శ్రీకృష్ణపరమాత్ముని దర్శనభాగ్యమే నాకు చాలు. ధర్మరాజు ధర్మాత్ముడు. అతని అశ్వాన్ని మనమెందుకు కట్టివేయాలి? అదీగాక సంవత్సర కాలం ముగియబోతున్నది. మీరే అశ్వాన్ని రక్షించి

అప్పగించండి' అని చంద్రహాసుడు తన కుమారులిద్దరికీ సలహా ఇచ్చాడు. అర్జునుడితో, సైన్యంతోపాటు శ్రీకృష్ణుడు కూడా వచ్చాడు. చంద్రహాసుని చూచి శంఖ చక్ర గదా పద్మ సహితుడై దివ్యదర్శనం ప్రసాదించాడు. చంద్రహాసుడు భక్తి ప్రపత్తులతో శ్రీకృష్ణుని పాదాలకు నమస్కరించాడు. శ్రీకృష్ణుడు అర్జునుడి వైపు తిరిగి 'అర్జునా! చూడు, ఇతడు పరమభక్తుడు. అతి నిర్మల మనస్కుడై నన్ను పూజించాడు' అని చెప్పాడు. చంద్రహాసుడూ, అర్జునుడూ మిత్రులయ్యారు.

చంద్రహాసుడు మకరధ్వజుని పిలిచి 'నాకు వయసయి పోయింది. ధర్మరాజు నిర్వర్తించే యాగానికి వెడుతున్నాను. ఆ తర్వాత ఇక్కడికి తిరిగి రాబోవడం లేదు. తపస్సుకు వెడతాను. రాజ్యభారాన్ని నీవే వహించు' అని చెప్పి ఆశీర్వదించి, రాజ్యాన్నప్పగించి కృష్ణార్జునులతోపాటు వెళ్ళిపోయాడు.